ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము.

అనుబంధగ్రంథమాల. 43.

శ్రీరామచంద్ర.

# నీతిముక్తావళి.

(ప్రథమ భాగము.)

శ్రీమదాంధ్రమహాభారతమునుండియు
భర్తృహరినీతిశతకమునుండియు
ఏర్చికూర్పఁబడినది.



నాల్గవకూర్పు

కాకినాడ.

సుజనరంజనీ ముద్రాశాలలో
ముద్రింపఁబడినది.

1923

దీనివెల 0—6—0

# విషయసూచిక.

శ్రీరామచంద్ర.

# నీతిముక్తావళి.



## దైవభక్తి.



గీ. అఖిలజీవంబులకుఁజీవ • మైనవాఁడు
అఖిలకర్మములకు సాక్షి • యైనవాఁడు
అఖిలలోకేశ్వరుండగు • నాదిదేవు
నాత్మభజియింతు భక్తితో • ననుదినంబు.

ఉ. ఈశ్వర ! సద్విలాస ! పర
మేశ్వర ! భాస్వర ! సత్కృపాకరా !
శాశ్వతరూపదీపక ! వి
శాలజగద్రచనావినోద ! లో
కేశ్వర ! సాధుపక్ష విమ
లేక్షణ రక్షణ ! దుష్టశిక్షణా !
విశ్వమయాంతరంగ ! పరి
వేష్టితసజ్జన ! భక్తపాలకా !

గీ. ప్రాణిలోకంబులో జ్ఞాన • పటిమఁగన్న
మానవుఁడు సర్వశోభనా • స్థానమైన
దివ్యతరదైవభక్తి సా • ధించెనేని
ఐహికాముష్మికసుఖంబు • లందుటరిదె ?

# నీ తి ము క్తా వ ళి.

## మా తృ భ క్తి.

---

ఆ. బాలుఁడైనఁ గొడుకు • ప్రౌఢుఁడైన నువృద్ధుఁ
డైన నొక్క విధమ • యర్మిలియును
నరయు భరము దల్లి • కాపదార్థంబు జ
గంబు కలిమి కెల్లఁ • గారణంబు.

ఆ. క్షుద్రజంతువులకు • గురులకు నమ్మెయిఁ
దలఁప నొక్క రూప • తల్లి వలయు
నూఱుడిల్లఁ గలదె • యొండు పోటుల సువ
స్తువు నివాసమైన • చోటఁ గాక.

క. అప్పుడ యసమర్థుండగు
నప్పుడ దుఃఖియగు శూన్య • మై తోఁచు జగం
బప్పుడ మాతృవియోగం
బెప్పుడు వాటిల్లె నపుడ • యెంతయుఁ దూలున్.

క. కలవాఁడు లేనివాఁడు స
బలుఁ డబలుఁడు మూఢబుద్ధి • ప్రౌఢుండనఁ గా
వల దెవ్వరికైన జనని
కలిమియ యత్యంతసౌఖ్య • కరమై యుండున్.

---

# నీతిముక్తావళి.

## పితృభక్తి.

క. జనకుఁడు దపమును ధర్మం
బును విద్యయుఁ బరమదైవ ♦ మునుగావున నా
తనికిఁ బ్రియంబగు పని సే
సిన దేవతలెల్లఁ బ్రీతిఁ ♦ జెందుట గల్గున్.

---

## గురుభక్తి.

క. గురుభక్తి కళారత్నా
కరతరణామణి శిష్యజీవి ♦ కావరణంబున్
గురుభక్తిగలుగువారల
కరుదే సకలార్థసిద్ధి ♦ యగుటధరిత్రిన్.

---

## గురుజనభక్తి.

సీ. విను తల్లియును దండ్రి ♦ యును గురుండును సేవ
నీయులు సద్భక్తి ♦ నిత్యనిరతి
వారలఁ గొలుచుచు ♦ వారెద్ది సెప్పిన
నదియాచరించుట ♦ యధికధర్మ
మాగమత్రయమును ♦ నగ్నిత్రయంబు లో
కత్రయంబును దేవ ♦ తాత్రయంబు
ననువస్తువులు వార ♦ లందును జనని గా
రవమున నెక్కుడు ♦ రాజవర్య !

తే. యీజగంబున దివమునం ♦ బూజవడయు
మాతృభక్తుండు ♦ పితృభక్తమానసుండు
నట్లె యవ్యయానంద సం ♦ ప్రాపణంబు
గురుపదాబ్జసమారాధ ♦ కుండుఁగాంచు.

---

## రా జ భ క్తి.

సీ. దర్శనీయంబైన ♦ దైవంబు భూపాలుఁ
డిహము వెలిఁగించు ♦ నినుఁడు విభుఁడు
చనవునఁబోషించు ♦ జనకుండు నృపమౌళి
తమిమీరనలరించు ♦ తల్లి ప్రభువు
గుణదోషములఁదెల్పు ♦ గురుఁడు మహీంద్రుండు
హితముఁదెల్పెడి పురో ♦ హితుఁడురాజు
మేలొనఁగూర్చు స ♦ న్మిత్రుఁ డుర్వీశుండు
తలఁపులనీడేర్చు ♦ దాతనృపతి

తే. మహితమహిమాయుతుండు ప్రే ♦ మప్రపూర్ణుఁ
డనుపమజ్ఞానసంపన్నుఁ ♦ డాత్త సుస్వ
భావకలితుండునగు నర ♦ పాలుఁడెగద
యవనిజనులకు సన్నియు ♦ నైనవాఁడు !

ఉ. క్రోఁతియె యయ్యె మారుతి య
కుంఠితవిక్రముఁడై యపారవి

## నీ తి ము క్తా వ ళి.

ఖ్యాతపయోనిధిం గడవఁ
గల్గెను, సూతుఁడెయయ్యుఁగర్ణుఁడా
స్ఫీతచరిత్రుఁడై నృపతి
సేవితుఁడయ్యె; దలంచిచూడఁగా
నాతతరాజభక్తులకు
నందఁగరాని యభీష్టముండునే ?

సీ. శ్రీమద్వసుంధరా ♦ స్థితజనోన్నతిఁగూర్చు
ప్రథితప్రభావశక్తి ♦ రాజభక్తి
ధర్మార్థకామము ♦ క్తాచయంబు లొసంగు
రమణీయతరశక్తి ♦ రాజభక్తి
సంతత సన్మార్గ ♦ సరణిఁబ్రబోధించు
ప్రాంచదాగమసూక్తి ♦ రాజభక్తి
అనవద్యభువనయా ♦ త్రానందముఘటించు
రమ్యనౌకాయుక్తి ♦ రాజభక్తి

తే. సకలభూమండలికిని బ్ర ♦ శాంతమైన
తేజమిడునద్భుతవ్యక్తి ♦ రాజభక్తి
అఖిలజనులకనంతసౌ ♦ ఖ్యంబునిచ్చు
రాజతామృతభుక్తి శ్రీ ♦ రాజభక్తి.

## మూర్ఖపద్ధతి.

క. తెలియనిమనుజుని సుఖముగఁ
దెలుపందగు సుఖతరముగఁ ♦ దెలుపఁగవచ్చుం
దెలిసినవానిం దెలిసియుఁ
దెలియని నరుఁ దెల్ప బ్రహ్మ ♦ దేవునివశమే ?

చ. మకరముఖాంతరస్థమగు
మానికముం బెకలింపవచ్చుఁ బా
యకచలదూర్మికానికర
మైన మహోదధిదాఁటవచ్చు మ
స్తకమునఁ బూవుదండవలె
సర్పమునైన ధరింపవచ్చు మ
చ్చికఘటియింపమూర్ఖజన
చిత్తముఁ దెల్ప నసాధ్య మేరికిన్.

తే. తివిరి యిసుమునఁ దైలంబుఁ ♦ దీయవచ్చుఁ
దవిలి మృగతృష్ణలోనీరుఁ ♦ ద్రావవచ్చుఁ
దిరిగికుందేటికొమ్ము సా ♦ ధింపవచ్చుఁ
జేరిమూర్ఖులమనస్సు రం ♦ జింపరాదు.

చ. తెలివియొకింత లేనియెడఁ
దృప్తుఁడనై కరిభంగి సర్వముం
దెలిసితినంచుగర్వితమ
తిన్ విహరించితిఁ దొల్లి యిప్పుడు

నీ తి ము క్తా వ ళి.

జ్వాలమతులైన పండితుల
సన్నిధి నించుక బోధశాలినై
తెలియని వాఁడనై మెలఁగి
తిం గతమయ్యె నితాంతగర్వమున్.

---

వి ద్వ త్ప ద్ధ తి.

చ. సకలకలావిభూషితులు
శబ్దవిదుల్ నయతత్వబోధకుల్
ప్రకటకవీంద్రు లే న్నృపతి
పజ్జను నిర్ధనులై చరింతు రా
వికృతపుజాడ్య మాందొరది
విత్తములేకయ వారు పూజ్యు లం
ధకజనదూషితంబులు ఘ
నంబులుగావె యమూల్యరత్నముల్.

ఉ. హర్తకుఁగాదుగోచర మ
హర్నిశమున్ సుఖపుష్టి సేయు స
త్కీర్తిఘటించు విద్యయను
దివ్యధనం బఖిలార్థికోటికిన్.
బూర్తిగ నిచ్చినం బెరుఁగుఁ
బోదు యుగాంతపువేళ నైన భూ

భర్తలు తద్ధనాధికుల
పట్టున గర్వము మానుటొప్పగున్.

తే. ప్రభులు పండితులగువారి ◆ వలన గర్వ
కలన మానుఁడు, వారు మీ ◆ కలిమి తృణము
లీలఁ బోలింపలేమి; మృ ◆ ణాళ గుణము
భూరిమదవారణములకు ◆ వారణంబె !

చ. వనజభవుండు గోపమున
వాహనమైన మరాళభర్తకున్
వనజవనీవిహార కల
నంబు దొలంగఁగఁ జేయుఁగాని గుం
భనమున దుగ్ధజీవన వి
భాగవిధాననిరూఢనైపుణీ
జనితమహాయశోవిభవ
సారము హంసకు మాన్పఁజాలునే.

ఉ. భూషలుగావు మర్త్యులకు
భూరిమయాంగదతారహారముల్
భూషితకేశపాశమృదు
పుష్పసుగంధజలాభిషేకముల్
భూషలుగావు పూరుషుని
భూషితుఁజేయు పవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము

భూషణముల్ నశియించు నన్నియున్.

ఉ. విద్యనిగూఢగుప్తమగు
విత్తము రూపము పూరుషాళికిన్
విద్యయశస్సు భోగకరి
విద్య గురుండు విదేశబంధుఁడున్
విద్యవిశిష్టదైవతము
విద్యకుసాటి ధనంబు లేదిలన్
విద్య నృపాలపూజితము
విద్యనెఱుంగనివాఁడు మర్త్యుఁడే.

చ. క్షమ కవచంబు క్రోధ మది
శత్రువు జ్ఞాతి హుతాశనుండు మి
త్రముదగుమందు దుర్జనులు
దారుణపన్నగముల్ సువిద్యవి
త్త ముచితలజ్జ భూషణ ము
దాత్తకవిత్వము రాజ్య మీక్షమా
ప్రముఖపదార్థముల్ గలుగు
పట్టునఁ దత్కవచాదు లేటికిన్.

తే. సత్యసూక్తిఘటించు ధీ ♦ జడిమమాన్చు
గౌరవమొసంగు జనులకుఁ ♦ గలుషమడఁచుఁ
గీర్తి బ్రకటించు జిత్తవి ♦ స్ఫూర్తిఁజేయు
సాధుసంగంబు సకలార్థ ♦ సాధనంబు.

## మా న శౌ ర్య ప ద్ధ తి.

తే. ప్రాణిలోకంబునంసార ♦ పతితమగుట
వసుధపై గిట్టిపుట్టని ♦ వాఁడుగలఁడె
వానిజన్మంబు సఫల మె ♦ వ్వానివలన
వంశమధికోన్నతి వహించి ♦ వన్నెకెక్కు.

తే. కుసుమగుచ్ఛంబునకుఁబోలెఁ ♦ బొసఁగుశౌర్య
మానవంతునకివి రెండు ♦ మహితగతులు
సకలజనమస్తకప్ర దే ♦ శములనైన
వనమునందైన జీర్ణభా ♦ వంబుగనుట.

మ. భువనశ్రేణివహించు శేషుఁడు ఫణా
భోగంబుపై సంతతం
బవలీలన్ భరియించుఁ బృష్ఠమునఁ గూ
ర్మాధీశ్వరుండాతనిన్
ధవళక్రోడవశాత్ముఁ జేయునతనిన్
వారాశి యశ్రాంతిచే
నవురా ! ధీరచరిత్రసంపద లసం
ఖ్యాతప్రభావోన్నతుల్.

తే. అర్కకాంత మచేతనం ♦ బయ్యు సవితృ
పాదములు సోఁకినంతనే ♦ ప్రజ్వరిల్లుఁ
గాన నభిమానవంతుఁడెం ♦ దైన శత్రు
కృతతిరస్కార మెట్లు స ♦ హింపనేర్చు.

## అర్థపద్ధతి.

క. ఏనరునకు విత్తముగల
దానరుఁడు కులీనుఁడధికుఁ ◊ డార్యుఁడతండే
ధీనిధి ధన్యుఁడు నేర్పరి
నానాగుణగణము కాంచ ◊ నంబుననిలుచున్.

మ. యతిసంగంబున బాలుఁ డాచరముచే
జ్యాభర్త దుర్మంత్రిచే
క్షితిహానిన్ ద్విజుఁ డన్వయంబు ఖలుచేఁ
గ్రూరాప్తిచే శీలము
ద్ధతిచే మిత్రత చూపులేమిఁ గృషి మ
ద్యప్రాప్తిచే సిగ్గు దు
ర్మతిచే సంపదలున్ నశించుఁ జెడు న
ర్థంబుల్ ప్రమాదంబునన్.

క. దానము భోగము నాశము
పూనికతో మూఁడుగతులు ◊ భువి ధనమునకున్
దానము భోగము నెఱుఁగని
దీనుని ధనిమునకుగతి దృ ◊ తీయమె పొసఁగున్.

తే. ధరణి ధేనువుఁ బిదుకంగఁ ◊ దలఁచితేని
జనులఁబోషింపు మధిప వ ◊ త్సములమాడ్కి
జనులుపోషింపఁబడుచుండ ◊ జగతి కల్ప
లత తెఱంగున సకలఫ ◊ లంబు లొసఁగు.

---

## దు ర్జ న ప ద్ధ తి

తే. విద్యచే భూషితుండయి ♦ వెలయుచున్నఁ
దౌడరివర్జింపనగుఁజుమీ ♦ దుర్జనుండు
చారుమాణిక్యభూషిత ♦ శస్తమస్త
కంబయిన పన్నగము భయం ♦ కరముగాదె.

శా. హ్రీరమ్యుం జడుఁగాఁగ సువ్రతుని మా
యింగా శుచిం దంభిఁగా
శూరున్ నిర్దయుఁగా మునిన్ విమతిఁగా
శ్రోత్రప్రియాలాపు ని
స్సారుంగా బలవంతు గర్వితునిగా
సద్వక్త వాచాలుఁగా
క్రూరుం డెన్ని సుధీగుణంబు దురితా
రూఢంబు జేయుంగదా!

తే. మొదటఁజూచినఁ గడు గొప్ప ♦ పిదపఁ గుఱుచ
యౌడిఁ గొంచెము తర్వాత ♦ నధికమగుచుఁ
దనరుదినపూర్వపరభాగ ♦ జనితమయిన
ఛాయపోలికఁ గుజన స ♦ జ్జనులమైత్రి.

తే. కసవుచే, నీటిచే, మోద ♦ కలనచేత
బ్రతుకు మృగ మీన సజ్జన ♦ ప్రకరమునకు
శబరకైవర్తసూచక ♦ జనులు జగతిఁ
గారణములేనిపగవారు ♦ గారె తలఁప.

---

## సు జ న ప ద్ధ తి.

ఉ. ఆపదలందు ధైర్యగుణ
మంచితసంపదలందుఁ దాల్మియున్
భూపసభాంతరాళమునఁ
బుష్కలవాక్చతురత్వ మాజి బా
హాపటు సక్తియున్ యశము
నందనురక్తియు విద్యయందు వాం
ఛాపరివృద్ధియున్ బ్రకృతి
సిద్ధగుణంబులు సజ్జనాళికిన్.

చ. కరమున నిత్యదానము ము
ఖంబున సూనృతవాణి యౌదలం
గురుచరణాభివాదన ము
కుంఠితవీర్యము దోర్యుగంబునన్
వరహృదయంబునన్ విశద
వర్తన మంచితవిద్య వీనులన్
సురుచిరభూషణంబు లివి
శూరులకున్ సిరిలేనియప్పుడున్.

తే. సంపదలుగల్గుతఱి మహా ♦ జనులహృదయ
మభినవోత్పలకోమలం ♦ బగుచు వెలయు
నాపదలు పొందునపుడు మ ♦ హామహీధ
రాశ్మసంఘాతకర్కశం ♦ బై తనర్చు.

మ. అసమానప్రియనీతివర్తనము ప్రా
　　ణాంతంబునందున్ మలీ
మస మగ్రాహ్య మదుష్టయాచన మసం
　　ప్రత్ప్రార్థనాభావమున్
వ్యసనావాప్తిని ధైర్యముం బుధజనా
　　త్యంతానుకూలత్వ మీ
యసిధారావ్రతచర్య యెవ్వఁడు మహా
　　ర్యశ్రేణికిం దెల్పెనో !

ఉ. నీరము తప్తలోహమున
　　నిల్చి యనామకమై నశించు నా
నీరమె ముత్యమట్లు నళి
　　నీదళసంస్థితమై తనర్చు నా
నీరమె శుక్తిలోఁబడి మ
　　హత్వముగాంచు సమంచితప్రభం
బౌరుషవృత్తు లిట్లధము
　　మధ్యము నుత్తముఁ గొల్చువారికిన్.

చ. నతులగుచున్ మహోన్నతిఁ ద
　　నర్చుచు నన్యగుణోక్తిచే గుణో
న్నతిఁ బ్రకటించుచుం బరజ
　　నప్రియకార్యసమర్థతన్ సమం
చితనిజకార్యసంగ్రహముఁ

జేయుచు నిష్ఠురవాదులన్ క్షమా
ధృతినిరసించుచుం బరఁగు
ధీరులుపుణ్యులుగారె యేరికిన్.

—

## ప రో ప కా ర ప ద్ధ తి.

గీ. తరువు లతిరసఫలభార ♦ గురుతఁగాంచు
నింగిఁ వ్రేలుచు నమృత మొ ♦ సంగు మేఘుఁ
డుద్ధతులుగారు బుధులు స ♦ మృద్ధిచేత
జగతి నుపకర్తలకు నిది ♦ సహజగుణము.

గీ అమరుఁ జెవి శాస్త్రమునఁ గుండ ♦ లమునఁగాదు
వలయమున నొప్పదీవిచే ♦ వెలయుఁ బాణి
యురుదయాఢ్యుల మేను ప ♦ రోపకార
కలనరాణించు గంధంబు ♦ వలనఁగాదు.

తే ద్యుమణి పద్మాకరము వికి ♦ చముగఁ జేయుఁ
గుముదహర్షంబుఁ గావించు ♦ నమృతసూతి
యర్థితుఁడు గాక జలమిచ్చు ♦ నంబుధరుఁడు
సజ్జనులు గారె పరహితా ♦ చరణమతులు.

మ. తమకార్యంబుఁ బరిత్యజించియుఁ బరా
ర్థప్రాపకుల్ సజ్జనుల్
దమకార్యంబుఘటించుచున్ బరహితా
ర్థవ్యాపృతుల్ మధ్యముల్

దమ్మై యన్యహితార్థఘాతుకజనుల్
దైత్యుల్ వృథాన్యార్థభం
గముగావించెడువార లెవ్వరో యెఱుం
గన్ శక్యమే యేరికిన్.

తే. అఘమువలనమఱల్చు హి • తార్థకలితుఁ
జేయు గోప్యంబు దాఁచుఁ బో • షించుగుణము
విడువఁ డాపన్ను లేవడి • వేళనిచ్చు
మిత్రుఁ డీలక్షణంబుల • మెలఁగుచుండు.

ఉ. క్షీరము మున్ను నీటికొస
గెన్ స్వగుణంబులు దన్ను జేరుటన్
క్షీరము దప్తమౌటఁ గని
చిచ్చుఱికెన్ వెతచే జలంబు దు
ర్వారసుహృద్విపత్తిఁగని
వహ్నిఁ జొరంజనె దుగ్ధ మంతలో
నీరముఁగూడి శాంతమగు
నిల్చు మహాత్ములమైత్రి యీగతిన్.

శా. ఆశాసంహరణంబు నోర్మియు మద
త్యాగంబు దుర్దోషవాం
ఛాశూన్యత్వము సత్యమున్ బుధనుతా
చారంబు సత్సేవయున్
వైశద్యంబును శత్రులాలనము మా

న్యప్రీతియుం బ్రశ్రయ
శ్రీశాలిత్వము దీనులందుఁ గృపయుక్
శిష్టాళికిఁ ధర్మముల్.

చ. హృదయవచశ్శరీరముల
నెంతయుఁ బుణ్యసుధాప్రపూర్ణులై
ముదము బహూపకారముల
మూఁడుజగంబులకున్ ఘటించుచున్
వదలక సాధుసద్గుణాల
వంబులుగొండలు సేసి మెచ్చుచున్
మదిని వికాసయుక్తులగు
మాన్యులుగొందఱు వెల్గు రిద్ధరన్.

---

## ధై ర్య ప ద్ధ తి.

తే. తనిసిరే వేల్పు లుదధి ర • త్నములచేత
వెఱచిరే ఘోర కాకోల • విషముచేత
విడిచిరే యత్న మమృతంబు • వొడముదనుక
నిశ్చితార్థంబు వదలరు • నిపుణమతులు.

శా. ఆరంభింపరు నీచమానవులు వి
ఘ్నాయాససంత్రస్తులై
యారంభించి పరిత్యజింతు రురువి
ఘ్నాయత్తులై మధ్యముల్

ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్
ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరుసుమీ
ప్రజ్ఞానిధుల్ గావునన్.

మ. ఒకచో నేలను బవ్వళించు, నొకచో
నొప్పారుఁ బూసెజ్జపై
నొకచో శాకములారగించు నొకచో
నుత్కృష్టశాల్యోదనం
బొకచో బొంతధరించు నొక్కొకతఱిన్
యోగ్యాంబరశ్రేణి లె
క్కకురానీయఁడు కార్యసాధకుఁడు దుః
ఖంబున్ సుఖంబున్ మదిన్.

శా. నీతిప్రౌఢవిహారులైన నిపుణుల్
నిందింపనీ మెచ్చనీ
ఖ్యాతిం జెందినసంపదల్ నిలువనీ
గాఢంబుగా పోఁగనీ
భూతంబప్పుడ పొందనీ నియతిపై
కానీయుగాంతంబునన్
నీతిశ్లాఘ్యపదంబుదప్పరుగదా
నిత్యంబు ధీరోత్తముల్.

గీ. నియతిచేతఁగదర్థితుం ◆ డయినధైర్య
పరుని ధైర్యగుణంబు మా ◆ న్పంగఁదరమె?

క్రిందు సేయుంగఁబడినట్టి ♦ కృష్ణవధుని
కీలలెందైన మీఁదుగాఁ ♦ గెరలుఁగాదె ?

చ. ఉరుతరపర్వతాగ్రమున
        నుండి దృఢంబగుఱాతిమీఁద స
త్వరముగఁ ద్రెళ్ళి కాయము హ
        తంబుగఁ జేయుట మేలు, గాలిమే
పరిదారవాఁతఁ గేలిడుట
        బాగు, హుతాశనమధ్య పాతమున్
వరమగుఁ జారుశీలగుణ
        వర్జన మర్హముగాదు చూడఁగన్.

చ. అతనికి వార్ధి కుల్యయగు
        నగ్ని జలంబగు మేరుశైల మం
చితశిలలీల నుండు మదసింహము
        జింక తెఱంగుఁ దాల్చుఁ గో
పిత ఫణి పూలదండయగు
        భీష్మవిషంబు సుధారసంబగున్
క్షితిజనసమ్మతంబగు సు
        శీలమదెవ్వనియందుశోభిలున్.

తే. ఖండితంబయ్యె భూజంబు ♦ వెండిమొలుచు
క్షీణుఁడయ్యును నభివృద్ధిఁ ♦ జెందుసోముఁ
డివ్విధమున విచారించి ♦ మొదలఁ దెగిన
జనములకుఁ దాపమొందరు ♦ సాధుజనులు.

ఉ. జాణగ భూతికిం దొడవు
సజ్జనభావము శౌర్యలక్ష్మికిన్
మానము నీతి విద్యకు శ
మంబు సుబుద్ధికి విత్తవృద్ధికిన్
దానము దాల్మి శక్తికిని
ధర్మనిరూఢి కదంభవృత్తియుం
బూనికతోడ సర్వగుణ
భూషణ మెన్నఁగ శీలమే సుమీ.

---

## దైవపద్ధతి.

క. కందుకమువోలె సుజనుఁడు
గ్రిందంబడి మగుడ మీఁది కి న్నెగయుసుమీ
మందుఁడు మృత్పిండమువలెఁ
గ్రిందంబడి యడఁగియుండుఁ గృపణత్వమునన్.

చ. దొసఁగులు వచ్చువేళ గుణ
ధుర్యుల ధైర్యగుణంబు సర్వమున్
బస చెడునంచుఁ జూచెదవు
పాపపుదైవమ! యీదురాగ్రహా
వ్యసనము మానుమాను ప్రళ
యంబున వీతనిజక్రమంబులై

నసి పెడవించుకంతయును
　　సాగరముల్ గులపర్వతంబులున్.

---

## వి ద్య.

గీ. విద్యయొసఁగును వినయంబు ♦ వినయమునను
　బడయుఁబాత్రత, పాత్రత ♦ వలన ధనము
　ధనమువలనను ధర్మంబు ♦ దానివలన
　నైహికాముష్మికసుఖంబు ♦ లందు నరుఁడు.

క. ధనమును విద్యయు వంశం
　బును దుర్మతులకు మదంబుఁ ♦ బొనరించును స
　జ్జను లైనవారి కడఁకువ
　యును వినయము నివియె తెచ్చు ♦ నుర్వీనాథా.

---

## సత్యము—సూనృతము.

చ. నుతజలపూరితంబులగు
　　నూతులు నూఱిటికంటె సూనృత
　వ్రత యొక బావి మేలు మఱి
　　బావులు నూఱిటికంటె నొక్కన
　త్క్రతు వది మేలు తత్క్రతు
　　శతంబునకంటె సుతుండు మేలు త
　త్సుతశతకంబుకంటె నొక
　　సూనృతవాక్యము మేలు సూడఁగన్.

క. వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్కసత్య • మును నిరుగడలం
దులనిడి తూఁపగ సత్యము
వలనన ములుసూపు గౌర • వంబునపేర్మిన్.

తే. సర్వతీర్థాభిగమనంబు • సర్వవేద
సమధిగమము సత్యంబుతో • సరియుఁగావ
యెఱుఁగు మెల్లధర్మంబుల • కెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞు • లైన మునులు.

క. ధీరమతి యుక్తిఁజేసి వి
చారింపఁగ నిక్కంబు • సర్వజనస్వ
ర్గారోహణసోపానం
బారఁగ సత్యంబచూవె • యతిరమ్యముగన్.

క. సమతయుఁ దమముఁ దితిక్షయు
నమత్సరము హ్రీయు ధృతియు • ననసూయార్య
త్వములు నహింసాదాన
క్షమాత్యజనమానృతములు • సత్యముమూర్తుల్.

క. సత్యాకృతులగుగుణములు
నిత్యానుష్ఠితసమగ్ర • నిర్మలయోగ
స్థిత్యభిముఖునకు సులభము
లత్యంతసుఖప్రదంబు • లవి కార్యంబుల్.

చ. కుదురు సమస్తధర్మముల
కుఁగా విను సర్వము యోగమోక్షస
త్పదములు సత్యవాక్యములు
పాపము సత్యముకంటె నొండు లే
దు తలఁప నశ్వమేధములు
దొమ్మిదినూఱులు వెండి నూఱునై
యొదవిన నీడుగావు భర
తోత్తమ! సత్యముతోడ నారయన్.

---

అ న్బ త దో ష ము.

ఆ. ధర్మ మెఱిఁగి వాని • దా నొండుగా లాభ
లోభపక్షపాత • లోలబుద్ధి
సభల నెవ్వఁడేని • సభ్యుఁడై పలుకువాఁ
డనృతదోషఫలము • ననుభవించు.

క. తనయెఱిఁగిన యర్థంబొరుఁ
డనఘా యిది యెట్లు సెప్పు • మని యడిగినఁ జె
ప్పనివాఁడును సత్యము సె
ప్పనివాఁడును ఘోరనరక • పంకమునఁబడుఁగా.

ఆ. సభకువచ్చి ధర్మ • సందేహ మడిగిన
నెఱిఁగిచెప్పకుండి • రేని సభ్యు

లనృతదోషఫలము • నందర్థ మొందుదు
రనిరి ధర్మవేదు • లైనమునులు.

---

## జ్ఞానము.

క. జ్ఞానము మదమానంబుల
మానుచు సుజనులకు; నిచ్చు • ముక్తిఁ గొందఱకున్;
జ్ఞానికిఁ గామికి విజన
స్థానము ముక్తియు నురక్తి • దా నొసఁగుఁ గతిన్.

## అజ్ఞానము.

క. రోషము శోకము రాగ
ద్వేషము లభిమానదర్ప • వేగాలస్య
క్లేశము లజ్ఞానమని మ
నీషిజనము సెప్పు మాన • నీయచరిత్రా.

---

## ధర్మము.

క. చలము సిరి చలము ప్రాణము
చలమరయఁగ జీవనంబు • జవ్వనమతిచం
చలమగు సంసారమునం
దలఁపఁగ నిశ్చలనమొకటె • ధర్మము కాదే.

క. ధర్మజ్ఞులైన పురుషులు
ధర్మువునకు బాధసేయు ◆ ధర్మువునందుఁ
ధర్మముగా మదిఁ దలఁపరు
ధర్మువు సర్వంబునకు హి ◆ తంబుగవలయున్.

క. తనకులధర్మము విడువక
మనుటపరమధర్మమంద్రు ◆ మాన్యులు చిత్తం
బునఁ గృపగలుగుట ముఖ్యపుఁ
బని సైరణవలయు నఖిల ◆ భావములందున్.

క. ధార్మికులు సలుపునుత్తమ
కర్మముఁ జెడనాడునాస్తి ◆ కజనము వినుమా
దుర్మతుల తెఱఁగుఁగనుఁగొని
ధర్మమునెడఁ బ్రీతివదలఁ ◆ దగదు బుధునకున్.

క. శరణంబని వచ్చిన భీ
కర శత్రుని నయినఁ బ్రీతిఁ ◆ గావఁగవలయుం
గరుణాపరుల తెఱంగిది
యిరువుగ నరిగావు దీని ◆ కేధర్మంబుల్.



## ఉ త్త మ గు ణ ము లు.

క. మనమున వేరమి దలఁపమి
యును నతమచిత్తుఁడగుట ◆ యును గుణములుగై

కొని దోషంబులు విడుచుట
యును నుత్తముఁడయిన పురుషు ♦ నుత్తమగుణముల్.

---

## శీ ల ము.

క. ఒలసిమనోవాక్కాయం
బుల ద్రోహాభావ మఖిల ♦ భూతములయెడం
గలిమి విను శీలమది మే
లొలయించును దాన నుల్ల ♦ మూన్చుముపుత్రా.

క. వరహితము సిగ్గుపాటుం
బొరయక యుండంగ నెదిరి ♦ బోధించుటయున్
నరసముదయంబు పొగడెడు
చరితము శీలమున కంగ ♦ సంపద వత్సా.

తే. సత్కులంబునఁబుట్టుట ♦ సకలవేద
ములుఁ బురాణంబులును శాస్త్ర ♦ ములునుజదువు
టయును సద్గతిఁజేయఁ జాల ♦ ధములుగావు
శీలసామగ్రిలేని దు ♦ శ్చేష్టితునకు.

---

## క్ష మ.

క. క్షమగలవానికిఁ బృథ్వీ
సమునకు నిత్యంబు విజయ ♦ సంసిద్ధియగున్
క్షమిదైనవానిభుజవి
క్రమముగదున్ వెలయు సర్వ ♦ కార్యక్షమమై.

ఆ. క్షమయు దాల్చియుండఁ ♦ జనదెల్లప్రొద్దుఁ దే
జంబ దాల్చియుండఁ ♦ జనదు పతికి
సంతతక్షముండు ♦ సంతతతేజుండు
నగుట దోషమందు ♦ రనఘమతులు.

క. క్షమలేని తపసితపమును
బ్రమత్తుసంపదయు ధర్మ ♦ బాహ్యప్రభురా
జ్యము భిన్నకుంభమునఁ దో
యములట్టుల యధ్రువంబు ♦ లగు నివియెల్లన్.

క. క్షమ మేలగునైన నతి
క్షమ దైన్యముఁ దెచ్చు నెనురు ♦ గర్వించినఁ గ
య్యము వొడిచి గెలిచి యరిశే
షము నెడ సదయక్షమావి ♦ శదుఁడగు టొప్పున్.

సీ. క్రోధంబు పాపంబు ♦ క్రోధంబు ననచేసి
యగుఁ జువ్వో ధర్మకా ♦ మార్థహాని
గదుక్రోధి కర్జంబు ♦ గానండు క్రుద్ధుండు
గురునైన నిందించుఁ ♦ క్రుద్ధుఁడైన
వాఁ డవధ్యులనైన ♦ వధియించు మఱియాత్మ
ఘాతంబు నేయంగఁ ♦ గడఁగుఁ గ్రుద్ధుఁ
డప్పాదృశులకు ధ ♦ ర్మానుబంధులకెట్టి
క్రోధంబు దాల్చుట ♦ గుణమె చెపుమ.

ఆ. యొఱుకగలమహాత్ముఁ ♦ డెఱుకయన్ జలముల
నార్చుఁ గ్రోధమను మ ♦ హానలంబుఁ

క్రోధవర్జితుండు ◆ గుఱుకొని తేజంబుఁ
దాల్చు దేశకాల ◆ తత్త్వమెఱిఁగి.

---

## మిత్త్రుఁడు.

క. మిత్త్రుం డైహికములు నా
ముత్త్రికములు నైనభద్ర ◆ ములుదలకొలుపున్
మిత్త్రధనంబులలోనను
మిత్రుఁడ యెక్కుడనుమాట ◆ మెత్తురు ప్రాజ్ఞుల్.

క. ఉత్తమకులజుఁడు సుగుణా
యత్తుఁడు సస్నేహమతియు ◆ నగుమిత్రునకుం
జిత్తమెలర్చు తెఱంగునఁ
బొత్తుమనఁగవలయు శుభముఁ ◆ బొందవలసినన్.

చ. ధనపతితోఁ దరిద్రునకుఁ
దత్త్వవిదుండగు వానితోడ మూ
ర్ఖునకుఁ బ్రశాంతుతోడఁ గడు
గ్రూరునకున్ రణశూరుతోడ భీ
రునకు వరూఢితోడ నవ
రూఢికి సజ్జనుతోడఁ గష్టదు
ర్జనునకు నెవ్విధంబునను
సఖ్యము దా నొడఁగూడ నేర్చునే.

## నీ తి ము క్తా వ ళి.

క. సమశీలవ్రతయుతులకు
సమధనవంతులకు సమసు • చారిత్రులకుం
దమలో సఖ్యము వివా
హమునగుఁగా కగునె రెండు • నసమానులకున్.

---

### దు ష్కృ తి.

క. కఱవుపయిఁగఱవు పెరయుచు
వెఱపుపయిన్ వెఱపుదోఁప • విడువనియిడుమం
దొఱఁగమిపైఁబురుషుఁడిడుమఁ
దొఱఁగమిఁ జేడ్పడుచు నడచు • దుష్కర్ములన్.

---

### సు కృ తి.

ఆ. ఉత్సవంబుమీఁద • నుత్సవమందుచు
సుఖముమీఁద సుఖము • సొప్పడంగఁ
బుణ్యపదముమీఁదఁ • బుణ్యపదంబున
కరుగు నరుఁడు సుకృతి • యైన నధిప.

---

### కా పు రు షు లు.

క. పలుమఱు శపథంబులు నం
జలియును నభివాదనమును • సామక్రియ భా
షలు మిథ్యావినయంబులుఁ
గలయవి దుష్టస్వభావ • కాపురుషులకున్.

---

## దు ర్వ్య స నము లు.

క. తగునిది తగదని యెదలో
వగవక సాధులకుఁ జేద • వారల కెగ్గుల్
మొగిఁ జేయు దుర్వ్యసనుల
కగు ననిమిత్తాగమంబు • లయినభయంబుల్.

## అ క్రో ధ నుఁ డు.

క. అనుపమనియమాన్వితులై
యనూనదక్షిణలఁ గ్రతున • హస్రంబులుసే
సినవారికంటె నక్రో
ధనుఁడు గరంబధికుఁడండ్రు • తత్త్వవిధిజ్ఞుల్.

క. అలిగిన నలుగక యెగ్గులు
పలికినమఱి విననియట్లు • ప్రతివచనంబుల్
వలుకక బన్నమువడి యెదఁ
దలఁపక యున్నతఁడుచూవె • ధర్మజ్ఞుఁడిలన్.

## దా న ము.

క. ఇచ్చునది ధనము ప్రాత్రున
కచ్చుగనొరు వేఁడకుండు • నది యభిముఖులై
వచ్చిన యాశార్థుల వృథ
వుచ్చక సేయునది సర్వ • భూతప్రీతిన్.

## ద్యూతము.

ఆ. కుటిలమార్గులయిన • కితవులతోఁ గడఁగిజూద • మాడఁజనదు
దానఁజేసి యర్థ • ధర్మవివర్జితు
లగుదు రెట్టివారు • జగములోన.

---

## దుర్జనుఁడు.

క. తనకిమ్మగునంతకు దు
ర్జనుఁడిష్టుఁడపోలెనుండి • సర్పముపోలెం
దనకిమ్మగుడును గఱచును
ఘనదారుణకర్మగరళ • ఘనదంష్ట్రలచేన్.

క. తనకపకారముసేసిన
జనుఁడల్పుండనుచు నమ్మి • జడమతివై చే
కొనఁజన దించుకముల్లయి
నను పాదతలముననున్న • నడవఁగనగునే.

క. ధృతిసెడి వేఁడెడువానిని
నతిథిని నభ్యాగతుని భ • యస్థుని శరణా
గతుఁ జంపుటకొడఁబడు దు
ర్మతి కిహాముంబరముఁగలదె • మదిఁబరికింపన్.

---

## దుర్జనసంపద.

క. మదమలిన మనస్కుఁ డగుం
తుదుఁడు నృశంసుఁడనఁబరఁగు ♦ దుర్జనునకు సం
పద లెడలయ్యును నాతని
మొదలిటిసంపదలతో స ♦ మూలంబు చెడున్.

---

## కలిమి.

క. కలిమియ చుట్టలఁ జేర్చుం
గలిమియ చెలులను ఘటించుఁ ♦ గలిమియ శౌర్యో
జ్జ్వలుఁ డనిపించుం గలిమియ
పలువురు సద్బుద్ధియనఁగఁ ♦ బరఁగంజేయున్.

## సత్సంగము.

క. తిలలును నీళ్లును వస్త్రం
బులుఁబుష్పసుగంధవాస ♦ మున సౌరభముం
బొలు పెసఁగదాల్చుఁగావున
నలయక సత్సంగమున ♦ నగుసద్గుణముల్.

---

## సత్సేవకులు.

ఉ. కాలిమి చేర్చువారలును
ధర్మవిధిజ్ఞులు సత్యవంతులున్
[illegible]లత లేనివారు మద

లోభ నిరర్థక కోపవిహీనులు
నీలసమేతులుం బలుక
నేర్పుటకార్యము కాన్పు పెంపుమైఁ
జాలుటఁగల్గుభృత్యులును
సంపద నేయుదు రాత్మభర్తకున్.

## ఆర్యులు.

క. శారీరమానసమహా
దారుణదుఃఖములఁ జేసి • తఱిఁగి శరీరుల్
క్రూరతర బాధఁ బొందుదు
రా రెంటిని జెఱుతు రార్య • లమలినబుద్ధిన్.

## లోభము.

క. విను లోభము నజ్ఞానం
బును సదృశఫలప్రదములు; • పుట్టును లోభం
బున నజ్ఞానము గావున
జననాయక ! లోభముడుగ • సౌఖ్యములొందున్.

## తృష్ణ.

క. అది సర్వదోషములకా
స్పద మది దురితక్రియాను • బంధంబులకున్

మొదలు నిరంతరదుఃఖ
ప్రదమని మదినెఱిఁగికృష్ణ ◆ బాతురసుమతుల్.

---

## పు త్ర ప్రే మ.

ఆ. ఎల్లనెయ్యములకుఁ ◆ దల్లిదండ్రులయందు
సుతులవలనినెయ్య ◆ మతిశయంబు
ధనములెంతగలిగి ◆ నను సుతరహితుల
కెమ్మెయిని మనఃప్రి ◆ యమ్ము లేదు.

---

## మ ద్య పా న ము.

ఆ. మొదలి పెక్కుజన్మ ◆ ములఁబుణ్యకర్మముల్
వరఁగఁజెక్కుసేసి ◆ పడయఁబడిన
యట్టియెఱుక జనుల ◆ కాక్షణమాత్రన
చెఱుచు మద్యసేవ ◆ సేయనగునె ?

---

## స ం ఘ బ ల ము.

తే. బలముగలవానిఁ బలువురు ◆ బలవిహీను
లొక్కటైకూడి నిర్జింతు ◆ రుత్సహించి
మధువుఁగొనసుత్సహించిన ◆ మనుజుఁబట్టి
కుట్టినిర్జించుమధుకర ◆ కులమునట్లు.

---

## కీ ర్తి.

ఆ. కీర్తిలేని వాని • కిని జీవనంబు ని
రర్థకంబు సూవె • యవని మీఁద
నిత్యమయిన ధనము • నిర్మలకీర్తియ
యట్టి కీర్తివడయు • టక్రమంబె?

కం. ఇలఁ గీర్తి యెంతకాలము
గలిగి ప్రవర్తిల్లునంత • కాలంబును ని
త్యులకారె కీర్తిగల పు
ణ్యులు; కీర్తివిహీనుఁ డెందు • నుం బూజ్యుండే?

---

## అ పా త్ర దా న ము.

ఆ. పుడమిఁ గుక్కతిత్తిఁ • బోసినపాలు నీ
ళ్ళధికనిందఁ బొరయు • నట్లు, దుష్టు
మై యపాత్రవిషయ • మగునీఁగి వృథపోవు,
నిచ్చుచోటఁ బాత్ర • మెఱుఁగవలయు.

---

## ప్ర జ్ఞ.

కం. ప్రజ్ఞయ ప్రతిష్ఠ, లాభము
ప్రజ్ఞయు, నాకంబనంగఁ • బ్రజ్ఞయె చువ్వే,
ప్రజ్ఞయ కైవల్యంబును
బ్రజ్ఞాసాధ్యములుగాని • పనులుంగలవే.

---

## కా మ ము.

క. శోకశ్రమతృష్ణలకున్
నీకలిమియమూలమగుట ♦ నీకగపడువాఁ
డేకర్తవ్యముగానం
డోకామమ! నిన్నుఁదొఱఁగి ♦ యుండెదసుఖినై.

క. నీవాసవఋపధనములు
గావించెదఁబో వినాశ ♦ కములనుడుపఁగా
నీవశమె కాన నీచెడు
పేవగపుందేదు పెనుప ♦ దే దైన్యంబున్.

చ. సులభమొ దుర్లభంబొ యని
చూడనెఱుంగవు గన్నదానిపై
నలముదు కామమా! యిడుమ
లందఁగఁజేయుదు నిండుకేమిటం
గలుగదు నీకు, నీతెఱఁ గ
గాధరసాతలభంగి, నీవు స
న్నొలమునఁ బోకయుండినను
బుచ్చెద బచ్చెనరూపుపోకులన్.

తే. ధనముచేటున విసివిన ♦ మనము నిన్ను
నీడవిడిచెనో కామమ! ♦ యేనుశాంతి
దాంతిసత్యక్షమాభూత ♦ దయలఁ జెంది
నాఁడ, లోభాదులొందవు ♦ నన్ను నింక.

తే. కామసుఖదివ్యసుఖములు • కాంక్షదొఱఁగు
మేలిషోడశాంశంబునఁ • బోలలేవు,
గాన కామము ! నిమశ్శత్రు • కరణిఁ జంపి
బ్రహ్మపురమున నుండెద • రాజువోలె.

---

## కీ డు మే ళ్ళు.

క. చనినఁ జను నున్న నుండు
న్మనుజుఁడొకటిసేయఁ జేయు • నరనాయక ! తో
డనతగిలి నీడవోలెను
వినుచేసినకీడుమేలు • విడువవువానిన్.

---

## సు ఖ దుః ఖ ము లు.

క. సమయం బైనను గుసుమఫ
లములెట్టులుదోఁచుఁ దరువు • లం దటితోఁ గ
ర్మములం బొడమున్ సుఖదుః
ఖము లట్టుల, నిష్ప్రయత్న • కలితోద్భూతిన్.

ఆ. బ్రదుకు చేటు పొగడు • వడుట దూఱొందుట
యోగి వేఁడుకొనుట • యిట్లు మఱియుఁ
గలుగు సౌఖ్య దుఃఖ • ములు వచ్చు నెడనెడ
వాని కింత యేల • వగవ నధిప !

తే. సుమతులు గ్రహింప రెండు వా ♦ క్యములలోన
నిర్వచించెద సుఖదుఃఖ ♦ నియమములను
సర్వమాత్మవశంబులు ♦ సౌఖ్యదములు,
పరవశములన్నియును దుఃఖ ♦ భాజనములు.

---

## ఆర్యమార్గము.

క. తెలిసికొనఁబడయ రౌరు లా
ర్యుల పోయెడి తెరువులరసి ♦ యును, జదలం బ
క్షులు, నీళ్ళలోన మీనం
బులు వోయెడుత్రోవ లెఱుఁగఁ ♦ బోలునె యధిపా!

క. వినను గాథనిరూపణ
మానసుఁడై యార్యజనుల ♦ మహితవచనముల్
వినులనినుచుచు ధర్మము
లైనవి సేయంగఁ దప్ప ♦ కగుఁ దత్ఫలముల్.

---

## అధికమతులు—అల్పబుద్ధులు.

ఆ. కార్యగతుల తెఱఁగు ♦ కలరూపు సెప్పిన.
నధికమతులుదాని ♦ నాదరింతు
రల్పకార్యబుద్ధు ♦ లగువారలకు నది
విరసకారణంబు ♦ విషమపోలె.

---

## సప్తవ్యసనములు.

తే. వెలఁది జూదంబు పానంబు ♦ వేఁట పలుకు
ప్రల్లదంబును దండంబుఁ ♦ బరుసఁదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ ♦ వమ్ముసేఁత
యనెడు సప్తవ్యసనములఁ ♦ జనదు తగుల.

---

## కృతఘ్నత.

చ. ఒకరుని చేతిప్రాపును ద
దున్నతిప్రాపునుగాంచి యొల్లవెం
టకును గొఱంత లేక బాగ
డ్డందగు సంపద నొంది యట్టిదా
తకుఁ దుదిఁ గీడు సేసిన కృ
తఘ్నుని పీనుఁగు నైన రోఁతపు
ట్టక కబళింపఁ గుక్కలును నొ
ల్లంబడునే ? కురువంశవర్ధనా !

---

## కార్యసిద్ధి.

ఆ. కమియఁ బండకుండఁ ♦ గాయఁ గోసినఁ జవి
చేరికాదు విత్తు ♦ చేటుఁ గలుగుఁ
బక్వమగుడుఁ గోయ ♦ ఫలమిచ్చుఁ జెడదు బీ
జంబు కార్యసిద్ధి ♦ చందమిట్లు.

తే. మాలకరిపుష్పములు గోయు • మాడ్కిఁ, దేఁటి
పువ్వు దేనియఁ గ్రోలెడు • పోల్కిఁ, నెదురు
గందకుండఁగఁ గొనునది • కార్యఫలము
బొగ్గులకుఁ బోలె మొదలంటఁ • బొడువఁ జనదు.



అ స హ న ము.

క. పరులధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకు • బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడు న
న్నరుఁడు దెవ్వులు లేని వేద • నం బడు నధిపా !

---

ప లు కుఁ బ డి.

క. మనమునకుఁ బ్రియంబును హిత
మును బథ్యముఁ దథ్యమును న • మోఘము మధురం
బును బరిమితమును నగుపలు
కొనరఁగ బలుకునది ధర్మ • యుతముగ సభలన్.
క. చెలిమియుఁ బగయును దెలివియుఁ
గలకయు ధర్మంబుఁ బాప • గతియును బెంపుం
దులువతనంబును వచ్చును
బలుకుఁబడిన, కాన పొసఁగఁ • బలుకఁగవలయున్.
క. తనువున విఱిఁగినయలుఁగుల
ననువునఁ బుచ్చంగవచ్చు • నతినిష్ఠురతన్

మనమున నాటిన మాటలు
విను మెన్ని యుపాయములను ♦ వెడలునెయధిపా!

---

## నీ తి.

ఆ. నీతి లేనివాని ♦ సందింత్రు లోకులు
లేదు సేగి లాతి ♦ లేకయున్నఁ
గాన మానవుండు ♦ పూనిక నయవిద్య
గడనసేయ మొదలఁ ♦ గడఁగవలయు.

ఉ. నీతిపథంబినన్ బ్రదుక
నేర్పుట యుత్తమభంగి, శౌర్యసం
జాతములైకరంబలరు
సంపదలొందుట మధ్యవృత్తి, యు
న్నీతములైన భారవహ
జీవనముల్ దలంపఁ గనిష్ఠముల్,
నీతికిబాహ్యులైనధర
జీవర మెత్తురె వారినుత్తముల్.

---

## రూ ప ము.

గీ. స్వరమె రూపంబు పరభృత ♦ వర్గమునకుఁ
బ్రొత్తడితనంబెరూపంబు ♦ కోమలులకు

విద్యయే రూపము కురూప ♦ వితతికెల్ల
శాంతియేరూప మెప్పుడు ♦ సంయములకు

---

## బాంధవులు.

గీ. అర్థుకే బాంధవులు లోక ♦ మందు నాకు
సత్యమే తల్లి, జ్ఞానమే ♦ జన్మదాత,
ధర్మమే తోడఁబుట్టువు ♦ దయయె హితుఁడు,
శాంతియే ధర్మచారిణి క్షమయె కొడుకు.

---

## ఉపకృతి—అపకృతి.

గీ. పలికెద శతాధికగ్రంథ ♦ భావమెల్లఁ
దేటతెల్లంబుగా నొక్క ♦ మాటలోన
పుడమిని బరోపకృతిసేఁత ♦ పుణ్యమునకై
పరుల కపకృతిసేఁత పా ♦ పంబుకొఱకె.

---

## ఏకమత్యము.

చ. కరితురగాదిఘట్టనయు
గాలియు నొంపదె యొంటియున్న య
త్తరువు ననేకభూరుహవి
తానము గుంపయిచేర్చి శాఖలం

పోరయునె? యన్నదమ్ములును
పొందిన నేరి కసాధ్యు లట్లుగా
కౌరవయి నిల్చినం గెలని
కెల్లిదమై పఱిపోదు రెంతయున్.

## స్వా ర్థ త్యా గు లు.

క. కారణములేకయును నుప
కారపరత్వమున నొరుల ♦ కార్యంబులకున్
వారని యలజడిఁబడియెడు
వారలమా యేడుగడయు ♦ వారికి నధిపా.

## స త్ప్ర వ ర్త న ము.

క. జనులకు నొడఁబాటగు విధ
మున నడచుచు లోకనింద్య ♦ ములనుడుగుచు మీఁ
రిన యొకనికలిమికులుకక
మనుజులతోఁ బొందిపొసఁగి ♦ మనుటొప్పునృపా.
తే. తగినవేషంబు దనుఁదాన ♦ పొగడుకొనమి
నొచ్చియును గీడు వలుకమి ♦ యిచ్చిపగవ
కునికిఁ దనకెంత నడవక ♦ యున్నఁబథముఁ
దప్పకుండుట నడవడి ♦ గొప్పనేయు.

## సజ్జనుఁడు.

క. తను లోకము గొనియాడఁగ
విని యుబ్బఁడు సజ్జనుండు ♦ వెండియుఁ గడు మే
లొనరించుఁ గీడొకించుక
యును దనదెసఁ దోఁపనీక ♦ యుడుగుచువచ్చున్.

---

## ఉత్తముఁడు.

క. పురుషుండు రెండు దెఱఁగుల
ధర నుత్తముఁడనఁగబరఁగుఁ ♦ దానెయ్యెడలం
బరుషములు పలుకకునికిన్
దురితంబులు వైరయుపనులు ♦ దొఱఁగుటకతన్.

---

## పుణ్యపురుషులు.

తే. చెల్లియుండియు సైరణ ♦ సేయునతఁడుఁ
బేదవడియును నర్థికిఁ ♦ బ్రియముతోడఁ
దనకుఁగలభంగినిచ్చున ♦ తండుఁ బుణ్య
పురుషులని చెప్పి రార్యులు ♦ బుధవరేణ్య.

---

## వగపు.

క. వగ బలముదఱుఁగు రూపఱు
వగచిన మతిదప్పుఁ నెవ్వులు ♦ వచ్చుం దూరన్

వగచినలంగినఁ బ్రియమగుఁ
బగతురకును, వగచుటుడుగు ♦ పార్థివముఖ్యా.

## ప గ.

ఆ. పగయకలిగనేని ♦ పాము న్న యింటిలో
నున్నయట్లకాక ♦ యూఱడిల్లి
యుండునెట్లు చిత్త ♦ మొకమాటుఁగావున
నలవదధికదీర్ఘ ♦ వైరవృత్తి.

చ. పగయడఁచించుటెంతయు శు
భం బదిలెస్సయడంగునే పగం
బగవగగొన్నమార్గ్గనక
పల్కకయుండఁగవచ్చునేకడుం
దెగ మొదలెత్తి పోవఁ బగ
దీర్పఁగవచ్చిన గ్రౌర్యమొందు నే
మిగలిఁదలంచినం బగకు
మేలిమి లేదు ధ్రువంబు కేశవా!

## సే వా ధ ర్మ ము లు.

క. ఎఱిఁగెడువారికిఁనైనను
గఱవకతక్కరుచిత్రప ♦ కారము శుభముం
గొఱలుహితులట్లగుట నం
దఱకును జెప్పంగవలయుఁ ♦ దగిమొదుబుద్ధుల్.

క. తగఁజొచ్చి తనకు నర్హం
బగునెడఁ గూర్చుండి రూప • మవికృతవేషం
బుగ సమయమెఱిఁగి కొలిచిన
జగతీవల్లభున కతఁడు • సమ్మాన్యుఁడగున్.

క. నరనాథుఁగొలిచి యడవడఁ
దిరిగితి నాకేమియనుచుఁ • దేఁకువలేమిన్
మరియాదదప్ప మెలఁగినఁ
బురుషార్థంబునకు హాని • పుట్టకయున్నే.

ఉ. రాజగృహంబుకంటె నభి
రామముగా నిలుగట్టఁగూడ దే
యోజనృపాలుఁడాకృతికి
నొప్పగు వేషములాచరించు నే
యోజవిహారముల్ సలుప
నల్లమునంగడు వేడ్కసేయు నే
యోజవిదగ్ధుఁడై పలుకు
నొద్దులకుందగు నట్లు సేయఁగన్.

క. పుత్రులు పౌత్రులు భ్రాతలు
మిత్రు లనరు రాజులాజ్ఞ • మిగిలిన చోటన్
శత్రులకాఁ దమయలుకకుఁ
బాత్రము సేయుదురు నిజను • భస్థితిపొంటెన్.

క. చనువాని చేయు కార్యం
బునకడ్డమువొచ్చి సేరు • పున మెలఁగుచుఁదా

ను బయిఁబూసికొనుటఁ దన
మును మొలఁగిన మొలకువకును ♦ ముప్పగుఁ బిదపన్.

౪౪. రాజునొద్దఁబలువు ♦ రకు సంకటముగాఁగఁ
దిరుగువనుల కెంత ♦ తేజమయిన
వానిబుద్ధిగలుగు ♦ వారొల్ల రదిమీఁదఁ
జేటుఁ దెచ్చు నిట్లు ♦ సిద్ధమగుట.

౪౫. ఊరక యుండక పలువుర
తో రవమొనఁగంగఁ బలుకఁ ♦ దొడరుపక మదిం
జేరువఁగల నాగరికులుఁ
దారుఁగలిసి పలుకవలయు ♦ ధరణీశుకడన్.

౪౬. వేఱొక తెఱఁగున నొరులకు
మాఱాడక యునికి లెస్స ♦ మనుజేంద్రుకడం
దీఱమిగల చోటులఁ దా
మీఱికడఁగి వచ్చి పంపు ♦ మెయికొనవలయున్.

౪౭. ధరణిపు చక్కఁగ నెదురు
దక్కి పిఱుందునుగాని యట్లుగా
నిరుగెలనం దగంగొలిచి
యేమనునో యెటనూచునొక్కొ యె
వ్వారిదెస నెవ్వి జేతలఁపు
వచ్చునొ యాతనికింకంచుఁ జూడ్కి సు
స్థిరముగఁ దన్ముఖంబునన
చేర్చుచునుండుట నీతి కొల్వునన్.

క. నగవులలోపలిమాటలు
దగునే వెలినుగ్గడింపఁ • దన కేర్పడ నెం
డుగడంబుట్టినఁ బతి విన
నగుపనిచెప్పెడిదిగాక • యాతనితోడన్.

క. అంతిపురముచుట్టిరికం
బెంతయుఁ గీడంతకంటె • నెగ్గుతదీయో
పాంతచరకుబ్జవామన
కాంతాదులతోడిపొందు • కలిమి భటునకున్.

ఆ. ఉత్తమాసనములు • నుత్కృష్టవాహనం •
బులును గరుణఁదమకు • భూమిపాలుఁ
డీక తారయెక్క • నెంతటిమన్నన
గలుగువారికైనఁ • గార్యమగునె?

క. మన్ననకుబ్బక యవమతి
దన్నొందిన గ్రుక్కఁబడక • ధరణీశుకడన్
మున్నున్నయట్ల మెలఁగిన
యన్నరునకు శుభములొదవు • నాపద లడఁగున్.

క. జనపతి యెవ్వారినైనను
మనుపఁ జెఱుపఁబూనియునికి • మదిఁదెలియనెఱిం
గెనయేనిఁ దాను వెలిపు
చ్చునె మునుమున్నెట్టిపాల • నుండును దానిన్.

ఉ. ఎండకు వానకోర్చి తన
        యిల్లుప్రవాసపుంజోటునాక యా
  కొండునలంగుడున్ నిదుర
        కుందకకిదప్పడు దప్పిపుట్టి నె
  క్కండన యెట్లోకోయనక
        కార్యము పుట్టిన చోట నేలినా
  తం డొకఁ డాయనూపినను
        దత్పరతం బనిసేయుటొప్పగున్.

క. తానెంతయాప్తుఁడైన మ
  హీనాయకుసొమ్ము ♦ సొమ్ములుగా లో
  మానినభయమునఁ బొరయక
  మానినఁగా కెలగలుగు ♦ మానము బ్రదుకున్.

ఆ. ఆవులింత తుమ్ము ♦ హాసంబు నిష్ఠీవ
  నంబు గుప్తవర్త ♦ నములుగాఁగఁ
  జలుపవలయు నృపతి ♦ గొలువున్న యెడల బా
  హిరములైనఁ గెలసి ♦ కెగ్గులగుట.

క. వైరులదూతలు నెరవగు
  వారు నిరాకృతులుఁ బాప ♦ వర్తులుఁ దమకుం
  జేరువగా వర్తించుట
  నేరమి తుదిఁబోయి చేటు ♦ నిందయు వచ్చున్.

ఆ. వసుమతీశుపాల ♦ వర్తింపు నేనుంగు
  తోడనైన దోమ ♦ తోడనైన

వైరమగు తెఱంగు • వలవదు కానంత
పూజ్యుఁడైన జనుల • పొందు లెస్స.

క. కలిమికి భోగములకదా
ఫలమని తను మెచ్చిసి బయలు • వడఁ బెల్లుఁగ వి
చ్చలవిడిభోగింపక వే
డ్కలుసలుపఁగవలయు భటుఁ డ • డంకువతోడన్.

యు క్ష ప్ర శ్న ము లు.

---

ప్ర శ్నం.

క. దినకరునెయ్యదినడపును
దినకరునెవ్వారుగొలిచి • తిరుగుదు రద్దే
వునియస్తమించు టేమిట
ననఘ! తదాధారభూత • మదియెయ్యదియో ?

ఉ త్త ర ము.

తే. అనిన ధర్మజుఁడిట్లను • నబ్జహితుని
నడపుబ్రహ్మంబు; సురకోటి • నడచుఁగొలిచి;
ధర్మచేనస్తమితుఁడగుఁ • దపనుఁ డమ్మ
హాత్మునకు సత్యమాధార • మండ్రు బుధులు.

ప్రశ్న.

క. ఏమిట శ్రోత్రియుఁడనఁ జను
నేమిటఁ గడుమహిమవడయు ◆ నిమ్ముగఁ బురుషుం
డేమిట సహాయయుతుఁడగు
నేమిట నగుబుద్ధిమంతుఁ ◆ డేర్పడఁ జెపుమా.

ఉత్తరము.

క. శ్రుతమువలన శ్రోత్రియుఁడగు
నతులతపోయుక్తిఁగడుమ ◆ హత్త్వమువడయున్
ధృతిచే సహాయయుతుఁడగు
నతిశయముగ బుద్ధిమంతుఁ ◆ డగుబుధసేవన్.

ప్రశ్న.

తే. ఏమికతమున భూదేవుఁ ◆ డెసఁగుదేవ
భావమున, నాతనికిసాధు ◆ భావమెవ్వి
ధముననగు, నసాధుత్వమె ◆ ద్దానఁజెందు,
మానుషుండగునాతఁ డే ◆ దానఁజెపుమ.

ఉత్తరము.

చ. అనవుడు ధర్మజుండనియె
నధ్యయనంబున దేవభావముం
గను నవనీసువర్యుఁ డధి
కవ్రత శీలత సాధుభావ మా

తనికి విశిష్టవృత్తి దిగఁ
ద్రావి యసాధువనంగనుండు శౌ
చనియతిలేక మృత్యుభయ
సంగతినాతఁడు మానుషుండగున్.

ప్ర శ్న.

క. నావిని యతఁడాతనితో
జీవన్మృతుఁడెట్టివాఁడు ♦ సెప్పుమనుటయున్.

ఉ త్త ర ము.

దేవాతిథిపితృభృత్యాజ
నావళులకునిడక కుడుచు ♦ నతఁడని చెప్పెన్.

ప్ర శ్న.

చ. విను మగుడంగ వాఁడువ్వథి
వీపతిఁజూచి ధరిత్రికంటె ప్రేఁ
కనయగుదాని నాకసము
కంటెఁ గడుంబొడవైనదాని గా
డ్పునకును నెక్కుడైన జవము
బొంపిరివోవుదుదానిఁ బూరికం
టెను దట్టమైనదానిని ఘ
టింపఁగఁజెప్పుము నాకు నావుడున్.

ఉ త్త ర ము.

ఆ. తల్లి వేఁగునవ్వ ♦ ధరణికంటెను నాక
సంబుకంటెఁ బొడవు ♦ జనకుఁడరయ

గాడ్పుకంటె మనసు ◆ గడుశీఘ్రగతి తృణో
త్కరముకంటెఁ జింత ◆ గరముతఱచు.

ప్ర శ్న.

తే. మొనసినిద్రించియును గన్ను ◆ మూయదెద్ది
పుట్టియునుజేతనత్వంబుఁ ◆ బొరయదెద్ది
యరయరూపుగల్గియు హృద ◆ యంబులేని
దెద్ది, వేగంబుకతమున ◆ నెద్దివెలుచు.

ఉ త్త ర ము.

తే. అనినఁ గన్నుమూయదుసు ప్త ◆ మయ్యుమీను,
పుట్టియుఁ గ్రుడ్డు చేతనం ◆ బొరయకుండు,
హృదయరహితంబురాయూప ◆ మేఱు రయము
కతన వర్తించు, ననిచెప్పెఁ ◆ గౌరవుండు.

ప్ర శ్న.

క. ఎయ్యది ధర్మువునకుఁ గుదు
రెయ్యది యాశ్రయముగీర్తి ◆ కిమ్మగు మార్గం
బెయ్యది సురలోకమునకు
నెయ్యది సుఖములకు నిక్క ◆ యెద్దియొఁజెపుమా.

ఉ త్త ర ము.

క. అమరంగ దాక్షిణ్యము ధ
ర్మమునకుఁ గుదురండ్రు, కీర్తి ◆ మహిమనెలవుదా
నము, సత్యము సురపురిమా
ర్గము శీలముసంశ్రయము సు ◆ ఖంబులకెల్లన్.

ప్రశ్న.

చ. నరునకునాత్మ యెవ్వఁడు ఘ
నంబుగ దైవికమైనచుట్టమె
వ్వ రతనికిం దదీయమగు
వర్తన మేమిట నిర్వహించు భూ
వరయతఁ డేమిపూని యన
వద్యతఁ బొందు నెఱుంగఁ జెప్పుమీ
వరుడుగ నన్న నక్కురుకు
లాగ్రణి యాతనితోడ నిట్లనున్.

ఉత్తరము.

తే. ఆత్మజుఁడు సువ్వె పురుషున ◊ కాత్మ యయ్యె
నాతనికి భార్య దైవిక ◊ మైనచుట్ట
మతనిజీవిక పర్జన్యు ◊ కతనఁ జెల్లు
నతఁడు దానముగొనియాడి ◊ యతిశయిల్లు.

ప్రశ్న.

చ. అనవిని మేటిధర్మమగు
నట్టిది యెయ్యది, యెట్టి దెప్పుడుం
గనియఁగఁబడియుండు నెన
కంబుగ నెయ్యది నిగ్రహించినం
దనరుఁ బ్రమోదసిద్ధి, నియ
తంబుగ నెవ్వరితోడిసంధి యొం

దునువికలంబుగాదు పరి
తోషమెలర్ప నుపన్యసింపవే.

ఉ త్త ర ము.

ఆ. విను మహింస మేటి • యనఁ జనుధర్మంబు,
యోగకర్మ మెపుడు • నొనరఁబండి
యుండు, మనసుక్రొవ్వు • ఖండింపఁగా మోద
మెనఁగు, సుజనసంధి • యొడలదెందు.

ప్ర శ్న.

తే. అనిన నతఁడు లోకమున కె • య్యదియుదిక్కు
జలము నన్నము నెద్దాన • సంభవించు
విషమనంగ నెయ్యది శ్రాద్ధ • విధికినెద్ది
సమయ మనిన నిట్లని చెప్పె • జనవిభుండు.

ఉత్తరము.

తే. సజ్జనులుదిక్కు సూవె యీ • సర్వమునకు
నభముధరణియు జలము న • న్నమ్మునుద్భ
వించు నెలవులు, విషమగు • విప్రధనము
లనఘ ! శ్రాద్ధకాలము బ్రాహ్మ • ణాగమంబు.

ప్ర శ్న.

వ. మనుజుం డెయ్యది పరిత్యజించిన సర్వజనప్రియుండును, నిశ్శోకుండును, నర్థవంతుఁడును, సుఖియునగును ?

ఉత్తరము

తే. సర్వజనసమ్మతుండగు ♦ గర్వముడిగి
క్రోధమడంచి శోకమునకుఁ ♦ గొలువుగాఁడు
వినవె యర్థాడ్యుఁడగులోభ ♦ మొనరవిడిచి
తృష్ణవర్జించి సౌఖ్యంబు ♦ తెరువుఁగాంచు.

ప్రశ్న.

వ. పురుషశబ్దవాచ్యుండెట్టివాఁడు? సర్వధనియగు వాఁడెవ్వఁడు?

ఉత్తరము.

క. దివిముట్టి ధరణియంతట
నివిడిమెఱయుచుండు నెవ్వ ♦ ని యశోరవ మ య
ట్టివిశిష్టచరితుఁడు య
క్షవరా! బురుషుండునాఁబ ♦ కాశితనొందున్.

ఆ. ప్రియము నప్రియంబుఁ ♦ బెల్లగుసౌఖ్యదుః
ఖములు భూతభావి ♦ కార్యములును
నెవ్వనికిసమంబు ♦ లివి సర్వధనియనఁ
బరఁగుఁజువ్వొ యట్టి ♦ భవ్యుఁడనఘ.

ప్రథమభాగము.

సమాప్తము.